## నవాబ్ సైపుల్ సర్ నవాబ్‌జంగుబహద్దరు శెట్టిపల్లి సంగారెడ్డిజాగీరు ప్రజల హీనస్థితి

మాజాగీరు నవాబుగారి తహసీలుదారుగారు మాతేవదుగారున్ను మాకుకష్టములు కలిగించు చున్నారు. మాప్రాంతము చుట్టుతాలూకాలోనెంద ను, ఎల్లారెడ్డి పట్టె గ్రామాదుల భూమిపన్ను లెట్లు న్నవోగాని మాజాగీరులో మాత్రం అధమపక్షము ౫౦-౬౦యా రెండుపంటల తరీపన్ను; ౧-౨-౧౫ వరకు ఒకపంటతరీపన్ను యేర్పాటుచేసినారు, మేము ఈరెండుమూడేండ్లనుండి మా జాగీరు నవాబుగారితో "మాభూమిపన్నుల భారమెక్కువ యున్నది ఆభారమునుండి మమ్ముతప్పింపు" మని మనవిచేయగా నవాబుగారు అధికదయవలన ఒకకన్నుతో చూచి ఒక చేతితో వ్రాసి కొంత తగ్గించి బరాయిండా అనిమాకుసమ్మతి పరిచిరి. ఇంతవరకు రెండుసంవత్సరములనుండి వారు ఆశీలియాకు వెళ్లితిరిగిరాలేదు ప్రభువెన్నడువచ్చునోఅని చూచిచూచి యున్నాము. ఇక మా బ్రతుకుదెరువు, హీనస్థితి ఎవరితో మనవి చేసుకొనవలెనో తెలియ రాకున్నది.

మనరాష్ట్రమునకు శ్రీ శ్రీ ఛత్తారీనవాబుగారు ప్రధానామాత్యులుగా వచ్చియున్నారని తెలిసి యీదిగువమొరలతో వారిసన్నిధిలో మొరపెట్టు కొనుచున్నాము.

౧. భూమిపన్నుల భారము- మితిమీరినపన్ను లను తీసివేసి ఖాల్సావలె సువ్యాయిచేయించి మాబ్రతుకు తెరువులకు జీవములను రక్షించవలెను

౨ మాపశువులకు ఖాల్సాలోవలె లేక యి చ్చిన మేతచాలకలదు. నవాబుగారి యిలాకాలో ౨౦౦౦ ఎకరముల కొండల గుంటలు బీడు,కోళ్ళు లు ప్రత్యేకించి మాపశువులు మేయుటకు చోటు లేకుండాచేసి, దౌర్జన్యముతో పశువులను బందె లలో వేయుచున్నారు. వంట కట్టెలకుగూడా పన్ను యేర్పాటుచేసి యిటువంటి పెన్నిదిరా చిక్కులపాలు చేయుచు కష్టపెట్టుచున్నారు.

౩. ప్రజలకు ప్రతిఆసామికి తగురీతిగా పట్టా భూములు యేర్పాటుఅయినవి- వాటిలో కొన్ని భూములను శివాయిజమాబందీ అనివేలంకావల యునని యిదివరలో వేలంచేయుటకు ఏర్పాటు చేసియున్నారు నేటివరకు ఒకయేడయినా పన్ను లు చెల్లించలేక పోయితిమా? ౨౦ సం॥ నుండి పట్టాలుకొనియుండల ఆసామిఖాతాకు ఏఆధారము తో అమలుచేసి యున్నారో గ్రహించుదురు గాక!

## పెట్రోలు అంటుకొని పలువురు చచ్చుట

దేవరకొండ

౪ఆజారు౧౩౫౧నాడు ఉదయం(౫)గంటల వేళకు దేవరకొండలో మునుషయ్య ముస్తాజర్ గారు చాలావరకుపెట్రోలుతెచ్చి తనమేడలో ఉంచినట. నిప్పుకల్లపెట్రోలుకాలినది, వత్తాల నిండపెట్రోలుఉండెను. ఒకేపర్యాయము దబ్బా లుపగిలి క్రమేణ (౫౦-౬౦)మంది నిప్పుచల్లార్చ ప్రయత్నపడినందున వారికిగాయములయ్యెను-ఇం దులో చాలామందికి పెద్దగాయములుతగిలినవి-బ్ర తికేవీలు లేకుండా ఉన్నది. ఆస్పత్రిలో ఇదివరకు నల్గురుచనిపోయినారు. ఇంకా (౮-౧౦) మంది బ్రతికేవీలు లేదు. ఆ సమయములో దేవరకొండ అస్పత్రిలో మందులుబట్టలు లేకుండెను- అందువల్ల రైతులంతాగుమిగూడి యంౘకొండలరావు వకీల్ గారిని సంఘకార్యదర్శిపదవిస్థాపించిరి. వెంటనే చందాజమచేసిరి. నగరంనుంచి మందులుతెప్పించే ప్రయత్నంచేసిరి. ఇప్పుడు గాయపడినవారికి రైతు సంఘమునుంచి సహాయముజరుగుచున్నది. ఇట్టిసం ఘమునుంచి ఆరోగ్యశాఖాధికారిమరియు అవ్వ లుతాలూకుదారుగారు సివిల్‌సర్జన్ గారు జిల్లా పోలీసు పధానాధికారి మొహతెమీంకోత్వాలి గారలు సహాయపడగలందుకు శేరేమనివి చేసుకొ నైనది. అధికారులు యిట్టికార్యమునుగురించివిచా రించి యింతఘోరకార్యమునుగురించి తగుయత్న ముచేయగలరని నమ్మకపడుచున్నారము.

---

ఒక పట్టేదారుగాని యినాం పట్టేదారుగాని మరణించినచో సదరుపట్టాను వారసులుగా కుమా రుడుగాని భార్యగాని లేక తమ్ముడుగాని ఉండ గలరు- వారిపేరట విరాసతుకొరకు పటేలు పట్వారి చావురిపోర్టులో తహసీలుకు తెలియపర చుట. తహసీలుదారు ముఖ్యవారసును పిలిపిం చుట, వారిపేరట విరాసతుచేయించుట జరుగ గలదుగదా! పట్టేదారు నజరానాయిచ్చుకొన్న చో విరాసతుఅంగీకరింతురు. వారిసంసారంబీద స్థితిఅయినచో నజరానాకుభీతిచెంది దూరముతో లగుట ఉత్తమమని రిత్తచేతులతో వెళ్ళిపోవుచు న్నారు. ఇదియేమిన్యాయము?

[౪౩ మంది హిందూముసల్మాను రైతులసంత కములతో అంగుష్ఠపుగుర్తులతో యీవార్త పంప బడినది.]

---









## మద్యపాన నిరోధక సంఘస్థాపన

(ఉ.వి.) కరీమాబాదు, ఆజారు

వరిలబాదు ౧౩౫౧ఫసలీ తారీఖున శ్రీ అఖిల భారత పద్మశాలీయుల శిరోమణియగు గుంటు వరసయ్య పంతులుగారి అధ్యక్షతక్రింద గిర్మాజి పేట లక్ష్మీపురములలో (అనగా నగరంలో-బజా రులలో) మద్యపాననిరోధక సంఘము స్థాపించి యున్నాము-దీనికిఅధ్యక్షుడు రామచంద్రంగం గారికొమారుడు మద్దినాగుపతులుగారు, కార్యదర్శి, శ్రీ కోదాటి హనుమంతరావుగారు

---

## మెటుపల్లిజాగీరు దేశముఖుగారి అఖండ అన్నదానము.

(ఉ. వి.) మెటుపల్లిజాగీరు ౧౩-౧౦-౪౧ఫ

శ్రీమాన్ ఫరుకుమ్ముల్ గారి జాగీరు ము ఖ్యగ్రామము. ౫-౬వేలజనసంఖ్యగలది-ఈగ్రామ ములో దేశముఖుగారు కలరు, వారు చాల యోగ్యులు-దయాళువులు-(ప్రస్తుతకష్టపరిస్థితు లలో, పెట్టిదాకతమాన్పించి, బీదలకు తగుసహా యము చేయుచున్నారు. వీరంతట గ్రామస్థులను అతిమ ర్యాదగా ఈ దసరాపండుగకు దేశముఖుగారు ౫౦౦మంది హరిజనులకు అన్నదానముచేసిరి.

---

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర కార్తీక శు॥ 3

గురువారము


# లంచములు - ఆర్యసమాజము.

హైద్రాబాదునగరమునుండి మమ్లుకత్ అను ఉర్దూవారపత్రిక వెలువడుచున్నది. దానిఅజూర్ నాటి సంచికలో ప్రధానమంత్రి గారికి హైద్రాబాదు రాష్ట్రములోని కొన్ని ముఖ్యమగు లోపాలను తెలియజేయుచు ఒక సంపాదకీయ వ్యాసము వ్రాయబడియున్నది. మనరాష్ట్రములోని ముఖ్యలోపములలో లంచముల అతివ్యాప్తి ఒకటియని అందువ్రాసినారు. కచ్చేరీలలో లంచములు తీసుకొను ఆచారము చాలాఉడుకుగా ఉన్నదనియు భూమ్యాదాయశాఖలో యూరోపియన్ అధికారుల నియామకమైనను లంచాలు తీసుకొను వృత్తిలో ఏమిన్నీ వ్యక్తమగు తగ్గుదల కానరాలేదనియు వ్రాయుచు ప్రత్యేకముగా జిల్లాపోలీసు శాఖలోని లంచాలను గురించి ఇట్లువ్రాసినారు. "రాజకీయ దృక్పథముప్రకారము జిల్లాపోలీసుశాఖలో కొందరి అధికారుల లంచగొండి తనము అత్యంత నష్టకారియైన దుష్ఫలితముల నుత్పత్తి చేయుచున్నది." ఈ ఆరోపణమును స్థిరపరచుటకై పై పత్రికాసంపాదకులు రెండు నిదర్శనాలను ఉదాహరణ రూపముగా వెల్లడిచేసినారు. అవేవనగా

"ఒకగ్రామములో ఆర్యసమాజ కార్యకర్తలు అచ్చటి ధనికుల సహాయముచే ముసల్మానుల వాడపైబడిరి. పోలీసువారు వచ్చిరి. ఆర్యసామాజికులు ౧౦౦౦రూ పాయిల మూటను పోలీసు (అమీన్) సబ్ఇన్స్పెక్టరు కిచ్చిరి. తత్ఫలితముగా పోలీసువారు నిజ నిందితులను పట్టుకొనుటనువదలి ఏమెరుగని జీకగాండ్రను కొందరిని పట్టుకొని వారికి శిక్షయిప్పించిరి కాని ముసల్మానుల అయిదేండ్లక్రిందట కలిగిన యీభీకాహము నేటివరకును పట్టుకొని కచ్చుచుసేయున్నది. మరియు బుద్ధిమంతులైన హిందువు లదంతాచూచి పోలీసువారిపై అసహ్యముకలిగినవారైరి

ది మొదటికథ. ఇక రెండవ కథను ఆదేసంపాదకీయములోనే పై విషయమువెనువెంటనే యిట్లు వ్రాసియున్నారు.

౨. ఒకకాలాకాలో ఆర్యసమాజమువారొక పెద్దసభచేసిరి, చుట్టుపట్టుల గ్రామాలవారిని ఆహ్వానించిరి. పోలీసు అమీనులో ఒకసంధిచేసికొనిరి. అదేమన "మేము ౧౫౦౦ రూ॥ ఇత్తుము, మేము కాంగ్రెసు జండాను ఎగురవేయుదుము. నీవు ఏమిన్నీ దానిసంగతిపై అధికారులకు తెలుపగూడదు" అమీను కానుకనుస్వీకరించెను. ౧౫౦౦౦మందివరకు కూడిన ఆసభయందుట కాంగ్రెసు జండాను ఎగురవేసి యిట్లుపన్యసించిరి, "సోదరులారా! నిజాంరాజ్యము ముగిసిపోతున్నది. ఇంతలో హైద్రాబాదులో కాంగ్రెసు రాజ్యమురానున్నది రానున్న శుభవార్తను ఈ జెండా చెప్పుచున్నది. ఈ యుత్సవమును ఈపోలీసు అధికారియెదుటనే చెప్పుచున్నాము. కాదన నీకేమి సమ్మకమ్ముగా!" ఈ ౧౫౦౦౦ మంది తర్వాత ౧౫లక్షలమంది కీవార్తను తెలిపియుందురు. దీని వలన యెంతటి భయంకర రాజకీయ దుష్పరిణామము కలిగినదో చెప్పవలదికాదు."

ఇవి మమ్లుకత్ పత్రిక వారుచూపినిదర్శనములు. జిల్లాపోలీసుశాఖలోఅన్ని శాఖలకన్న ఎక్కువ లంచమున్నదని చూపుటకో యేమో వారు ప్రత్యేకముగా పరిశోధనచేసి రెండు గొప్పవిషయాలను బయటికి తేగలిగినారు. ఆరెండు విషయాలుకూడా ఆర్యసమాజము వారికి సంబంధించినవే. ఆర్యసమాజము పేరు చెప్పుటలో కొన్ని విశిష్టతలు కలవు. ఆర్యసమాజమంటే ఒక సైతాన్ సమాజం అనుభావన ఈరాష్ట్రములో కల్పింపబడినది. "మేము ఆర్యసమాజంవారము కాము" అనికొందరుహిందూప్రముఖులు ప్రత్యేకముగా చెప్పుకొనుటకలదు. "వీరు ఆర్యసమాజంవారు" అనిప్రత్యేకముగా ఆర్యసమాజంవారు కాని హిందువులను ఎత్తి చూపుటకూడా వినియున్నాము. ఏదైనా కలహంజరిగినలేక ఎవరినిగురించియైనా అధికారులభావాలలోభ్రమకలిగించదలచినచో ఆవిధముగా అందురనియు విన్నాము. పై ఉర్దూవారపత్రిక వారికిని ఈవిశాలమగు హైద్రాబాదు రాష్ట్రములో లంచాల చరిత్రలో రెండు ఘోర విషయాలు — ఆరెండును ఆర్యసమాజ సంబంధమైనవే- దొరకినవి. ఒకటిఐదేండ్లక్రిందట జరిగినది. ఇంకొకటి యెప్పుడు జరిగినదో సూచించలేదు.

ఈరెండు నేరాలును నిజముగా ఘోరమైనట్టివి. ఆర్యసమాజ కార్యకర్తలుకూడా ఇట్టివాటిని ఏమాత్రమున్నూ ఒప్పుకొనరని మేము అనుకొనుచున్నాము. ఆర్యసమాజంవారి దృష్టికి ఇంతవరకీవిషయము వచ్చియుండవలెను. వారు తమసమాజముయొక్క కీర్తిని కోరువారైతే వెంటనే యీనిందితుల చర్యలను గర్హించి ఖండించి స్పష్టమైన ప్రకటన చేయవలెను. మమ్లుకత్ పత్రికాధిపతులు ఈరెండు సంఘటనలు ఏయే స్థలాలలో జరిగెనో తెలుపలేదు. వారికి వ్రాసి ఆ స్థలాలపేరును ఇంకను ఇతరవివరాలను అన్నింటిని కనుగొని తాము ఆస్థలాలకు వెళ్లివిచారించి తమవారిదే యైన అత్యాచారమై యుండినచో జంకకుండా బయటపెట్టి వారికి తగిన శిక్షనకూడా ఇప్పించవలెను. ఏసమాజమైననునరే గుండాలకు హింసావాదులకు, అసత్యప్రచారకులకు, తావిచ్చునో ఆసంఘము నశించుటకు అర్హమైనది. కావున ఆర్యసమాజనేతలు వెంటనే యీ అపకీర్తినుండి తమ్ము రక్షించుకొనినిజముగా పై రెండు స్థలాలలో తమవారెవ్వరైనను తప్పుచేసినవారుండిన తాము మొదట బహిష్కరించి తర్వాత శాసనరీత్యా శిక్షయిప్పింతురుగాక. అటుగాక తమవారిపై కేవలము అపనింద మోపబడినచో అట్టిప్రచారముచేసిన పత్రికపై మానసష్టాది శాసన క్రియల నవలంబింతురుగాక.

మమ్లుకత్ పత్రిక వారివద్ద సమగ్రమైన అపరాధనిరూపణ ప్రమాణాలు లేనిది అంతధైర్యముగా వ్రాయజాలరు. అయిదేండ్లక్రిందటి సంగతి. ముసల్మానులనుకొట్టుట ఒక నేరము. ౧౦౦౦ రూ॥ లంచము తీసుకొనుట రెండవనేరము. నిజమైన నిందితుల విడచిపెట్టుట మూడవనేరము. "ఖండితముగా ఏమిన్నీ అపరాధముచేయని భగోడాలను అపరాధకులని" పట్టుకొనుట నాల్గవనేరము- అట్టి అమాయక నిరపరాధులపై తప్పుడుసాక్ష్యాలిప్పించుట అయిదవనేరము. ఎట్లో న్యాయస్థానం వారినినమ్మినట్లుచేసిఅమాయక నిరపరాధులకు శిక్ష యిప్పించుట ఆరవ నేరము. ఈ అయిదేండ్లనుండియు భయోత్పాతముచే గడగడవడకుచున్న ఆయూరి ముస్లిములభయమునూస్పకుండాయుండుట ఏడవనేరము. మొదటికథలో ఇన్ని నేరాలిమిడియున్నవి.

ఇక రెండవకథలోని విషయాలను చూతము. సభకు సెలవుతీసుకొన్నారో లేదో. ఆకాలములో గస్తీనిషాన్ ౫౩ అనురూపముతో వాఙ్నిరోధక శాసనముండెను. అమీనుకు ౧౫౦౦ రూపాయిల లంచమిచ్చుట మొదటితప్పు. కాంగ్రెసుజండా నెగురవేయుట రెండవ తప్పు. "నిజాంరాజ్యం అంతమొందుచున్నది"అని రాజద్రోహము క్రిందికివచ్చు ఉపన్యాసమిచ్చుటమూడవగొప్పనేరము. అమీను ఆయుపన్యాసాన్ని విని రాజద్రోహులను పట్టుకొనకుండా ఊరకుండుట నాల్గనేరము. అట్టి ఘోరరూపములనునాల్చిన యీరెండంశాలు ఆర్యసమాజము వారిచే జరిగినవని స్పష్టముగా చెప్పబడినందున కేవలము ఆర్యసమాజమువారే కాక ప్రభుత్వమువారు అందుముఖ్యముగా జిల్లాపోలీసుశాఖవారు తక్షణము విచారించి యదార్థమేమో రాష్ట్రివాసులందరికిని తెలియునటుల ప్రకటనచేయవలసియుండుట వారి ప్రప్రథమకర్తవ్యమైయుండును. ఈరెండు విషయాలలోను లంచాలిచ్చిన ఆర్యసమాజంవారును లంచాలుతీసుకొనిన పోలీసువారును ముఖ్యనిందితులగుదురు. కేవలం లంచమేకాక రాజద్రోహాపరాధములుకూడా జరిగినవి. కావున మమ్లుకతు వారిని విచారించి ఏస్థలములో నేరాలుజరిగెనో ఎవరెవరు నిందితులో వారిపేరులేమో ఈ వివరణమంతయు తెప్పించుకొని ప్రభుత్వమువారు కఠినచర్య నవలంబించి న్యాయమును ప్రసాదింతురుగాక.

మమ్లుకతుపత్రిక వారు కరోడిగిరి, ఆబ్కారీశాఖలలో లంచములు అపారముగానున్నవని వెల్లడించినారు. మమ్లుకతు వారికి తెలిసిన అంశాలు పైరెండు శాఖలకు తెలియకుండా ఉండవచ్చును. వారును పైపత్రిక వారికి వ్రాసియేమేమి ఆధారములు వారివద్దయున్నవో అవన్నియు తెప్పించుకొని విచారించి నిందితుల శిక్షించి తమవిచారణ ఫలితమును అందరికిని తెలియునట్లుగా ప్రకటింతురుగాక! భూమ్యాదాయ శాఖలో ఇంగ్లీషు అధికారులు ఉ డినప్పటికిన్నీ లంచాలబాధ తగ్గలేదను గొప్పబాధ్యతను ఇంగ్లీషుఅధికారులపై మమ్లుకతువారు మోపియున్నారు. కావున పైశాఖవారును తమ శాఖలోని లంచగొండితనాన్ని వీలైనంతవరకు పూర్తిగానిర్మూలించే ప్రయత్నముచేయుదురుగాక. మమ్లుకతు రు వ్రాసిన ఆరోపణలన్నియు నిజమైతే వారు రాష్ట్రానికి ఈసంపాదకీయమువల్ల అపారమైన సేవచేసినవారని అందరును వారిని ప్రశంసించవలసి యుండును.

---

## పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారికిసన్మానము

(స్వ వి)

శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు హైద్రాబాదునగరానికివచ్చిగండిసాలపాటుండిరి. శ్రీఆదిరాజు వీరభద్రరావు గారిఅతిథిగానుండిరి. శ్రీ కృ-దే-ఆం-భాషానిలయంలో వరుసగా మూడుఉపన్యాసాలిచ్చిరి- మూడింటికిశ్రోతలుచాలామందివచ్చి శ్రద్ధతోవినిరి- మూడవయుపన్యాసదినమునకే కొందరు వారికిజ్ఞానసన్మానం చేయుటకనితలూచినఅనుకొని అప్పుడేసభలో నేచట్టికెని ౧౦౦ రూ॥ వసూలుచేసిఅప్పుడే శాస్త్రిగారికి ఆమొత్తాన్ని సమర్పించి గౌరవించిరి శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు శ్రీశాస్త్రిగారు వెళ్లు దినమున వారికి నూతనవస్త్రములనిచ్చి బహూకరించిరి శ్రీశాస్త్రిగారికి బిరుదు వేంకటశేషయ్యగారును ఇల్లెందుల సీతారామరావుగారును విందులుచేసిరి- శ్రీశాస్త్రిగారికి హైద్రాబాదు ఆంధ్రులు మంచిగౌరవమును సన్మానమునుచేసి సత్కరించిరి. వారియుపన్యాసములుచాలా పరిశోధన ప్రమాణయుక్తములై వినోదకరములై యుండుటచే చాలామందిముగ్ధులై అతిశ్రద్ధతోవినిరి. శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు గొప్పపరిశోధకు నియు గొప్పవేదస్మృతి పురాణ పండితులనియు వారు సత్యమునుప్రకటించుటలో ఏమాత్రమున్నూ జంకరనియు శ్రోతలు బహువిధములవారిని మెచ్చుకొనిరి-

---

## విషాదము

[ఓ.వి]

జోగిపేట, అజూరు ౧౩

పరోపకారపారీణుడగు శ్రీ బి-మాణిక్యప్రభు గారికొమరుడగురామన్న గారుఅశ్వయుజశు॥ ౯ మంగళవారంరాత్రి చిరంగకుడైరని తెలుపుటకు చింతిల్లుచు వారికుటుంబమునకుమాస్వానుభూతి తెలుపుచు శ్రీవారియాత్మకు శాంతికొరకై ఈశ్వరునిప్రార్థింపుచున్నాము.

---

## కే. బి. శర్మగారిపై డి. పి. దేవిగారి దావా

(ఒకవిలేఖరి)

సికింద్రాబాదు, ౧౭-౧౦-౪౧.

సికింద్రాబాదు డిస్ట్రిక్టు మునసబ్ గారిపై శ్రీ డి.పి. దేవిగారు తెచ్చిన అభియోగమును గూర్చి ఆమెనువిచారించగా, దావా, భరణముకొరకుకాదనియు, డిస్ట్రిక్టుమునసబు రావుసాహెబు కే.బి. శర్మ గారివలన తనకుపుట్టిన పుత్రునిపోషణార్థమనియు తెల్పిరి. భరణముకొరకుదావాచేసినట్లు పత్రికలలోప్రకటించు డినవార్త సరికాదనిరి. దావా ఫలితము ముందు తెలుపబడు ను

యస్. యల్ శాస్త్రి.

---

## పౌరాధికారాలు

దాసప్పగారియుపన్యాసము

మైసూరుకాంగ్రెసు నాయకులైనదాసప్పగారు హైద్రాబాదునకువచ్చియుండిరి- హైద్రాబాదులో పౌరులహక్కులనుగురించి ఇట్లొకరీతోముచ్చటించిరి-

"హైద్రాబాదులో అందరును ఐకమత్యముతోఉండవలెను- హైద్రాబాదులో వాక్స్వాతంత్ర్యము చాలా అవసరమున్నది- సంస్థానకాంగ్రెసుకు ఉత్పత్తికాకమునుపే ప్రభుత్వంవారుఅణచి మతవాదులకు సంస్థలకు అవకాశమిచ్చినారు- సభలకు సెలవులేనిది జరుపుఅవకాశములేకుండ చాలా కఠినమైనదిజ్ఞ రాజ్యాంగ సంస్కరణములు ప్రజాస్వాతంత్ర్యానికి విరుద్ధమైనవి- హైద్రాబాదు రాష్ట్రి చుట్టూవృద్ధిపొందిన బ్రిటిషుఇండియా రాష్ట్రి ఉండగా ఇదిప్రత్యేకంగా దాగమూసుకొనుటసరికాదు- ఇక్కడిపరిస్థితులు మేలైనవిగాఉండకలేనంతే బాధ్యతాప్రభుత్వమేర్పాటు చేయవలెను- ఇక్కడహిందూముస్లిం ఐకమత్యం కొందరగాకాగలదనిఅనుకొంచిరి"

---

## పాటలంభాన హత్య

ఇతడు హైద్రాబాదు పురపాలక సంఘసభ్యుడు జాగీర్దారుకలీలు ఇతడుతనజాగీరగు గంగవరం ౨౦-౩౭దినాలక్రింద వెళ్లెను. రాత్రిగదిలోఉండగా ఎవ్వడో బయటినుండి తుపాకితో కాల్చెనట అతడు వెంటనే చచ్చెను

---

## స్థానిక వార్తలు

### మద్యని షేధస్థానము

హైద్రాబాదునగరములో మల్లేపల్లిలో నవాబుకమాల్ యార్జంగుగారు మద్యనిషేధానికిగాను కట్టించినభవనప్రారంభోత్సవము ౩ నవంబరునాడు వాలాషాన్ యువరాజుగారు కావింతురు.

---

### ఖాదీప్రచారసంఘ మహాజనసభా సమావేశము

(౨౬-౧౦-౫౧ఫ) సాయంకాలము ౫ గం టలకు, సుల్తాన్ బజారులోని మార్వాడీ హిందీవిద్యాలయ ఆవరణయందు, ఖాదీప్రచారసంఘ మహాజనసభజరుగును కావున సభ్యులందరు సకాలమునవిచ్చేసి కార్యక్రమమునందు పాల్గొనప్రార్థితులని కార్యదర్శి తెలుపుచున్నాడు

---

### ప్రధాన మంత్రిగారు

హైద్రాబాదు ప్రధానమంత్రిగారు సిమ్లాకు వెళ్లి యుద్ధసలహాసంఘములో పాల్గొనిరి తిరిగి ౧౯అక్టోబరునాడు హైద్రాబాదుకు విచ్చేసిరి. స్వాగతార్థమై సికింద్రాబాదుస్టేషనుకు చాలామంది గొప్పవారు వెళ్లిరి.

---

### గ్రంథని షేధం

నిజాంరాష్ట్రములో ఈక్రింది గ్రంథాలు నిషేధింపబడినవి.

(౧) నిజాం హైద్రాబాదుసత్యాగ్రహఇతిహాసం.
(౨) మహారాణాప్రతాప్ దేశోద్ధారనాయక
(౩) ఛత్రపతిశివాజీ మరాటా
(౪) బందాబహాదుర్
(౫) సంగీతపృథ్వీరాజ్.

---

### ఉద్యోగులు రాజకీయం

హైద్రాబాదురాష్ట్రి ప్రభుత్వోద్యోగులు రాజకీయసభలలో పాల్గొనరాదని ౧౩ బహమన్ ౧౩౪౪లోనే ఆజ్ఞ అయియుండెను. ఇప్పుడు దానిలో మరికొంత హెచ్చింపుఅయినది. అదేమనగా ప్రభుత్వోద్యోగులు ఏరాజకీయ సభలోను ఉండరాదు

---

### రైల్వే పనివారు

హైద్రాబాదు ప్రధానమంత్రిగారు ౧౯అక్టోబరునాడు లాలాగూడా కర్మాగారములోని రైల్వేపనివారితో మాట్లాడిరి- వారు మూడుకోర్కెలుకోరిరి. (౧)జీతాలహెచ్చింపు (౨)తెలివిగలపనివారికిఎక్కువజీతం (౩)తమయూనియను రైల్వేవారు అంగీకరింపవలెను- వారికోరలను ప్రధానమంత్రిగారు చాలాఓపికతోవినియుండిరి. జీతాలహెచ్చింపు విషయంలో ప్రభుత్వంవారాలోచించుచున్నారు. అదియింతలోతాగలదని నమ్మవచ్చును. (యూనియన్)సంఘమును అంగీకరించు విషయములో సంఘమువారు ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన షరతులకు మొదలు ఒప్పుకోవలెననిరి-

---

### హైదరాబాదు యుద్ధనిధి

హైదరాబాదుయుద్ధనిధికి పోయినసెప్టెంబరునెల ౩ వతేదీవరకు వాలీయా ౫౦౦౧౪౯౧-౫-౭లును, కల్దారు రూ ౨౭౪౩౫-౭-౭లును ఒక్కొకపారితోషకపడిసరాశలవల్ల చేరినవి సెలసెలకువచ్చుడి విరాళాలవల్ల ౭ వతేదీవరకు వాలీయా ౨౪౪౧౫-౩-౦లును, కల్దారురూ౧౩౦౯-౭-౦లును, చేరినవిట్లుమొత్తము సెప్టెంబరు ౯ వతేదివరకు వాలీయా ౫౨౩౦౦౭-౧౨-౫లును, కల్దారు రూ ౪౦౧౫౧-౧౩-౪లునుచేరినవి- ఇవి హైదరాబాదుదక్కన్ ఇంపీరియల్ బ్యాంకులో జమకట్టబడినవి.

---

### సలీంఖాతూన్

హైదరాబాదునగరంలో హిమాయతునగరులోని మైమునీసుయొక్క శంకుస్థాపనోత్సవమును గౌ॥"య్యద్బుల్జీమ్ము" గారు ఆదివారమునాడుజరిపినారు-

### విందు

సర్ అక్బర్ హైదరీగారు ౧౦ దినాలక్రిందట హైద్రాబాదునకు వచ్చియుండినప్పుడు గౌరవార్థం ప్రధానమంత్రిగారు విందుచేసిరి-

### యుద్ధములోచేరుట

నవాబుకమాల్ యార్జంగు బహద్దరుగారికుమారుడు యుద్ధములోపాల్గొనుటకై సంసిద్ధతవబరచి తెలుపుతున్నారు-

## ఇబ్బుగూడెం గ్రామరైతుల దుస్థితులు

(ఓ. వి.)

ఈగ్రామము వరంగల్లుజిల్లాలో ఖమ్మంమెట్టు అశ్వారావుపేటపోవు రోడ్డులోకి ౬మైలునుంచి ఉత్తరమున ౧౬మైళ్ళదూరమున అరణ్యమధ్యమున గలచిన్నపల్లె. ఇచ్చట జలాధారములలో ముఖ్యమైనది. దొమ్మెరసానమ్మ చెరువుఅనునదిఒకటి. ఈ చెరువునుదాదాపు పదిసంవత్సరముల క్రితం ప్రభుత్వమువారు కొంత పెద్దమొత్తమును ఖర్చుచేసి మరమ్మతుచేయించినారు. కాని చెరువునీరువచ్చే వరదకాలవను త్రవ్వించి మరమ్మతుచేయించనందున యీచెరువుకు యే సంవత్సరముకూడ నీరురాక చెరువుక్రిందవుండు పల్లప్రభూములు ప్రతిసంవత్సరముబీడుగావుంటూ జమాలందిపనుయమున రకాలుమాఫీనిగురించి పట్టేదార్లుఅనుభవించు కష్టనష్టములువర్ణనాతీతములు. ఏదేని ఒకసంవత్సరము వర్షాధారమున అలినేన్యముచేసినతరువాత అంత్యముకు వర్షములులేక చెరువుకు వరదరానికారణమునంది నీరు రాకపోయి, చేసినఅలి- రెండింతనష్టముఅయ్యేవరకు పంటకు నష్టమువిజ్ఞప్తులు పంపుకొనవలెను ప్రారంభమై కష్టనష్టములనుపడించి రైతును పీల్చిపిప్పిచేసేపరిస్థితి సంభవించుచుంది- ఈచెరువుకు వరదకాలవకొరకు అప్పుడే మాలు అధికార్లసముఖములో రెండో పర్యాయములు రైతులు విజ్ఞాపనపత్రములు పంపుకొనిరి. తుదకు రైతులు స్వంతముగా కాలువ త్రవ్వకొనుటకు సెలవుయివ్వగ అందులకు కోరికొని యుండేదియు కార్యకారికాక నిష్ప్రయోజనములయ్యెను,

ఇచ్చటిభూములు వట్టియిసుకపర్రలు, జలాధారములున్నచో అలివంట రెండుకరములక్కంటి కి గ రెండలుఒకటిన్నరవుట్టికరకు ఫలించును- మెట్టపైర్లు రయ్యేతరవేసినను సావువంతు పంటకూడ రాదుట దుస్తరము.

చెరువుక్రిందుక్క- వరదకాలవ కొరకు దాదాపు మూడువేల్ల వేలరూప్యములుఖర్చుచేసి మరమ్మతుచేయించినతరువు ప్రతిసం॥దాదాపు ఒకవెయ్యి రూపాయిలు ప్రభుత్వమునకు నిస్తులమూలము నారాగలవు. రైతు జీవితమును సుఖముగా గడుపుకొనును.

### మంచినీటి వసతులు

ఈగ్రామములో మంచినీటివసతులు బొత్తిగ లేవు. ఈగ్రామమునొక్క- ఆవాళ దాదాపు ౫౦౦గలదు. గ్రామములో నీటివసతికి నీరువచ్చే చెరువాలేదు-ఇక బావులపరిస్థితి విపరీతమైనలోతు ననీళ్ళుపడును-అనగా దాదాపు౫౦-౬౦అడుగుల లోతుతవ్వవలెను. ఈమొత్తములోతును వెంటనే రాయికాని యిటుకగానున్నంకాని కట్టి నాల్గువైపులఅడుగునుంచి పైవరకుగోడకట్టవలెను. లేనిచో తుకు బావిమాలుట ప్రారంభించి త్వరలోనే గుద్దిరోజులలోనే పడిపోవును- యీమొత్తమునకుగాను దాదాపు ౨౦౦౦రూపాయలకుతక్కువకావు. ఇంతటిపెద్ద మొత్తమును వెచ్చింపగల రైతురాయే ఒకరిద్దరికో కాని జనసామాన్యమింతటి పెద్ద మొత్తమును భరించగలదా!

లోకలుఫండునుంచి ఒకబావికొరకు రైతులు దరులు ఆనేకవిజ్ఞాపనములుపంపుకొనిరి-కాని ప్రభుతరేణ్ణుల గద్దలచెక్కు-చున్నవో లేక మధ్యనే హరింపబడుచున్నవో అగోచరము,

### దారులు

ఇటు ప్రాంతములకు ప్రభుత్వాధికారులు రారావలయునన్న భూమశకటముల సౌకర్యమా అసలేలేదు- మోటారుబండ్లుపరుగెత్తుటకు రోడ్డులేదు, సంకలో దాదాపు ౮-౨మాసములు దారి బురదచేతనున్న బురుగులచేతనున్న ఆవరింపబడుయుండును- ఇక వేసవికాలమన్ననో త్రాగుటడి నీరులేక కోసుల దూరమునుంచి త్రాగునీరు మోయు జనసామాన్యమురొక్క- హాహాకారములతో అరణ్యము ప్రతిధ్వనించుచుండును.

### కాలపరిస్థితి

యీసంవత్సరము మృగశిర కార్తె ప్రారంభములలో స్వల్పవర్షములుపడినందున పునాసపెంక్క- సువ్వపైర్లువేయుబడినవి-ఆరుద్రలో స్వల్పజల్లులుపడి నేవ్యానుకూలముగనుండెను-పునర్వసు కార్తెనుంచి యిప్పటివరకు దాదాపు౨నెలల ౧౫ రోజులనుంచి వర్షములులేక వేయబడిన పునాసర్లురెండి భూమట్టమైనవి- అలిపంట అసలుకే ధూర్తానుసారము.

ప్రభుత్వాధికారులు ఈక్రింది యేర్పాటులు చేయసూచించుచున్నాము.

౧ దొమ్మెరసానమ్మ చెరువు వరదకాలవను వెంటనే మరమ్మతు ప్రారంభించుట.

౨ ఖమ్మం అశ్వారావుపేట36మైలు నుంచికొత్తగూడెం రైలుస్టేషనుకురోడ్డు వేయించుట.

త్రాగు నీటికై యీగ్రామములో, ఒకమంచినీటి బావిని త్రవ్వించుట.

## ఆర్యజండా ఉత్సవము ఆగిపోవుట

జోగిపేట అజారు ౯

ఇక్కడ ఆర్యసమాజమువారు దసరాజండా ఉత్సవముజరుపుకొనుటకై దసరా రోజాకంటె ౧౫రోజులముందుగా తహసీల్దారుగారికి విజ్ఞాపనపత్రముపంపుకొనిరి. ౩౧రోజాతుసమాజమంత్రిగారిని పోలీసుఅమీనుగారుపిలిపించి, యీఉత్సవమెట్లుజరుగుననివిచారించిరి. అంతయువిశదముగా తెలుపబడినది మరి ౩రోజులతర్వాత తహసీల్దారుగారు సమాజమంత్రిగారినిపిలిపించి యిక్కడఅనుమతిదొరకదు జిల్లాకుపంపుతున్నాము, అక్కడినుండి యుత్తరువువచ్చేపర్యంతము జండా ఊరేగింపు తీయకూడదుఅనిరి. మరి ౬రోజులతర్వాత మరలపిలిపించి జిల్లానుండికూడదొరకలేదు జెండాతీయకూడదుఅనిరి.అశ్వయుజశు॥౧౦రోజున రాత్రి౯గంటలకుతమ్మలివానిచేపోలీసుపటేలుగారు వెంబడియుండి ఆర్యసమాజముజండా తీయుటకు యెవరికియిష్టమున్నదో వారలుఆఉత్సవముజరుపక ౯ గంటలకు చావడివద్ద తహసీల్దారు అమీనుగార్లవద్దకురావలసినదిఅనివాల్గువీధులలో చాటింపించిరి.అశ్వయుజశు॥౧౧రోజునఅధికారులు చావడివద్దకువచ్చి సమాజమంత్రిగారిని పిలిపించి యీఉత్సవము ఎట్లుజరుగుతుందిఅని విచారించిరి. మంత్రిగారు "యిదివరకు అమీనుగారికి తెలిపియుంటిని ఆ దేరీతిగాజరుగుతుంది" అనినుడివిరి.

ఆంతవారు ఊరిసాహుకార్లనుపిలిచి, "వీరికి అనుమతియివ్వవలయునా లేదా మీకేమైన హానిఉన్నదా" అనివిచారించిరి మీ యిష్టమువుంచేయివ్వండి లేనిచో అపివేయండి" అనియనిరి,

ఆర్యసమాజభవనములో ప్రధానిగారు విజయదశమిరోజునధ్వజారోహణచేసిరి.ఆర్యయువకులందరు అయుధములనుధరించి శమీపూజనుజరిపిరి. అక్కడనే వైదికధర్మచందా ౧౩౪ రూపాయిలు జమఅయ్యెను-

### దసరాజంతుబలి

(ఓ-వి)

నారాయణపురం సంస్థానం, అజారు ౯

ఈగ్రామం నల్లగొండజిల్లాలోచేరినది. ఇక్కడిజనసంఖ్య దాదాపు ౫౦౦౦లకుమించినది-కేవలముహిందువులు ౪౫౦౦కలరు- ఇక్కడదసిజయదశమి నాడు ప్రతిసంవత్సరము ఒకసారిఅందరుకలిసి జమ్మికివెళ్ళుటవాడుక, యీసంవత్సరము రెండుపార్టీలుగమారి మకాతసులు సంస్కర్తలు వేరుచేసుక వెళ్ళిరి కారణమేమనగా యిక్కడిసంస్కర్తలకు సాత్వికపూజ జరుపవలెనని కుతూహలమేర్పడెను. అదేమాదిరిగ జరుపగలమని పటేల్దారులు మొదలుఒప్పుకొనిరి-కాని సరిగాసమయమునకు జంతుబలిప్రారంభించిరి- పటేల్దార్లగుమాస్తాలు తమకువచ్చేమామూలు మాంసముకొరకులశపడి అట్లుచేయించిరి- ఇదియువకులకుగిట్టక చేయునదియేమియులేక పూజజరుగకముందేజమ్మికివెళ్ళిరి- తర్వాతజంతుబలిపూజతోపహా సనాతనులుజమ్మికివెళ్ళిరి-

దేశోద్ధారకులగు నాయకులు యేమైనపట్నాలలోనే పర్యటనసల పుదురుకాబోలు- మాపల్లెలసంగతియెవ్వరికిని పట్టనట్లున్నది-

## శ్రీపద్మశాలి యువజనసంఘ ప్రథమ వార్షికోత్సవము

(ఓ-వి)

సదాశివపేట, అజారు ౧

మెదక్ జిల్లాలోనిఈగ్రామమునగల శ్రీపద్మశాలి యువజనసంఘ ప్రథమ వార్షికోత్సవము తా॥ ౬, ౭, అక్టోబర్ ౧౯౪౧గలలో శ్రీయుత లక్ష్మణరావుకొండె వకీలు గారి అధ్యక్షతనవిజయప్రదముగ జరుపబడినది. సభాభవనమంతయుఓంకారనాదములతో ప్రతిధ్వనించెను. నిజాంరాష్ట్రపద్మశాలి యువజనసంఘాధ్యక్షులగు శ్రీయుత నక్క- వెంకటస్వామిగారు, కార్యదర్శి యెల్దిండిఅనంతయ్యగారు (హైద్రాబాదు), పండిత్ యెక్కాల్ దేవరాజరాంగారు(మల్కాబాదు), బొల్లలక్ష్మయ్యగారు(సికింద్రాబాదు) మొదలగుప్రముఖులుదయచేసియుండిరి. వచ్చినవారలయూరేగింపు అతివైభవముతోగావింపబడెను. ధ్వజారోహణోత్సవముతో కార్యక్రమము ప్రారంభింపబడెను

అహ్వాన సంఘాధ్యక్షులగు పాపక్ విశ్వనాథంగారు స్వాగతోపన్యాసము ప్రారంభించిసంఘపరిస్థితులన్నియు ప్రేక్షకులకు విశదపరిచినపిదప శ్రీయుతలక్ష్మణరావుకొండే వకీలుగారిగుణగణముల నగ్గడించుచు వారిని అధ్యక్షపీఠమలంకరించకోరిరి.

కార్యదర్శిగారు నివేదికచదివిరి. అధ్యక్షులవారి ఉపన్యాసముజరుగ శాంతిపాఠముతో సభముగింపబడెను,

## అభిలాషులకు ఉచితం

### శ్రీమాన్ దాశరథి వేంకటాచార్యులవారి ఔదార్యము

శ్రీమాన్ దాశరథి వేంకటాచార్యులుగారు శ్రీవైష్ణవ మతబోధక గ్రంథములను చాలాముద్రించినారు, టపాఖర్చులు ప్రతిగ్రంథానికీ అర్ధణా చొప్పున పంపువారికి తాముచరించిన ఈక్రింది గ్రంథాలు ఉచితముగా పంపుచున్నారు.

౧. రామానుజ రహస్యత్రయం
౨ దినచర్య
౩ తత్త్వత్రయ సంగ్రహము
౪. శ్రీవచన భూషణసారము
౫. తెలుగు రహస్యత్రయము
౬. ముప్పత్తాఱాయిరం-[భగవద్విషయము]
౭. ప్రమేయశేఖరం
౮. అర్థపంచకం.

ఇవి దొరకుస్థలం-
శ్రీమాన్ దాశరథి వేంకటాచార్యులుగారు
సీతారాంబాగ్, దత్తాత్రేయపహాడ్
హైద్రాబాదు దక్కన్.

## ప్రకటన

యిందుమూలముగా తెలియజేయునది యేమనగా మహబూబునగరము జిల్లాలోని మహబూబునగరం, మఖ్తల్, పదమరాబాదు, వనపర్తి, కల్వకుర్తి, మరియు నాగరకర్నూలు, వగైరా తాలూకాలలో కలరా, ప్లేగు, మరియు స్ఫోటకవ్యాధులు ప్రబలియుండుటచే ఆరోగ్యశాఖవారి సలహానునరించి శ్రీకురుమూర్తి స్వామివారిజాతర స్థానికముగానే యుబడును. గనుక పరస్థానికు లెవరు పాల్గొనుశ్రమ తీసుకొనవద్దు.

మాణిక్యప్రసాద్
తాలుకాదారు లోకల్ఫండుశాఖాధ్యక్షుడు
అమరచింత సంస్థానము

# భారతదేశపు అవసరమును అమెరికాకు వివరింపుడు

## కమలాదేవిగారి సూచన

భారతదేశ వాస్తవస్థితిని అమెరికాలో జనులకు విశదముచేయుటకై కాంగ్రెసు ప్రతినిధులను పంపుట అవసరమని కమలాదేవిగారు అక్టోబరు ౯వ తేదిన వర్ధాలో ఒక బహిరంగసభలో ఉపన్యసించుచు సూచించెను. భారతదేశముకవడా, ఆస్ట్రేలియాలున్నగు అధినివేశముల (డొమినియనుల) వలెనే అధినివేశప్రతిపత్తిని అనుభవించుచున్నదని గొప్పగొప్ప బ్రిటిషు ఉద్యోగులు అమెరికా ప్రజలకు చెప్పుచున్నారు. అట్టి ప్రచారమునకు విరుగుడుగా తాను చేయగలిగినదానిని చేసినను, అమెరికాలో బ్రిటిషు ప్రచారము ఇంకనుచాల హెచ్చుగానున్నది కాబట్టి, కాంగ్రెసువారే ప్రతిఘటన ప్రచారము చేయబూనుకొనవలసియున్నదని కమలాదేవిగారు చెప్పిరి.

కమలాదేవిగారు అక్టోబరు ౨వ తేదినను, ౧౦వ తేది ఉదయమునను గాంధిమహాత్ముని దర్శించి సంభాషించిరి. అమెరికాలో రెడ్ ఇండియన్ జాతి వారలనుండి తెచ్చిన వస్త్రములను, చైనీయులనుండియు జపానీయులనుండియు తెచ్చిన చేతి నిర్మాణ వస్తువులను గాంధిమహాత్మునికి కమలాదేవిగారు సమర్పించుకొనిరి.

అక్టోబరు ౧౦వ తేది సాయంకాలము కమలాదేవిగారు నాగపూరులో ఒక బహిరంగసభలో ఉపన్యసించుచు బ్రిటిషు రాజనీతినిపుణులును, భారతీయాధికారులును భారతదేశసమస్యను గురించి అమెరికాలో దుష్ప్రచారము చేయుచున్నారనియు, ఇటీవలనే బ్రిటిషు ప్రభుత్వము న్యూయార్కు నగరములో ఒక బ్రిటిషు గ్రంథాలయమును స్థాపించినదనియు, ఆ గ్రంథాలయమునుండి భారతదేశమును గురించిన అనేకవిషయములు తెలియజేయబడుచున్నవనియు, ఈ ప్రచారమువల్ల కలిగిన తప్పు అభిప్రాయమును పోగొట్టుట సులభముకాదనియు చెప్పిరి. అమెరికాలో జనులు బ్రిటనువల్లనే స్వతంత్రము పొందుచు బ్రిటనుకు కావలసినవాటిని అరువుగా ఇచ్చుచున్నందువల్ల యీ యుద్ధానంతరము బ్రిటను ప్రపంచమును ఏవిధముగా వ్యవస్థ చేయునో తెలిసికొనవలెనని అమెరికావారలకు కుతూహలముండునుగనుక భారతదేశము బ్రిటను ఏమిచేయుచున్నదో తెలిసికొనవలెననేకోరిక అమెరికావారలకున్నదని కమలాదేవిగారు చెప్పిరి. ఈ సంగతులన్నియు తాను గాంధిమహాత్మునికి వివరముతో తెలిపితినని కమలాదేవిగారు చెప్పిరి.

ఉపన్యాసము ముగించుచు కమలాదేవిగారు భారతదేశమునకు అమెరికా ప్రభుత్వము గాని, అమెరికా ప్రజలు గాని స్వాతంత్ర్యమును సంపాదించి ఇవ్వజాలరనియు, భారతీయులే తమ స్వాతంత్ర్యమును తాము సంపాదించుకొనవలెననియు, అయినను ఈ రోజులలో భారతదేశము ఇతరదేశములతో సంబంధములేని ఏకాకిగా ఉండజాలదు కాబట్టి ఇతరదేశములకు భారతదేశ వాస్తవస్థితిని తెలుపుచుండుట అవసరమనియు చెప్పిరి.

## ఢక్కా అల్లరులు

ఢక్కాలో అక్టోబరు ౨౧వ తేది సాయంకాలము మరల బాకుదెబ్బలు తగిలి మరిముగ్గురు చంపబడిరి వారలలో ఒకరు ౭౦ ఏండ్ల వృద్ధుడు. మరొకరు ఒక బాలుడు తిరిగి ఈ సారి అక్టోబరు ౨౨వ తేదిన ఉదయము ప్రారంభమయినది మొదలు ౬గురు చంపబడిరి.

## అఫ్ఘనిస్థానములో జర్మను కుట్రలు

అఫ్ఘనిస్థానములో జర్మనుల కుట్రలనుగురించి బ్రిటిషు ప్రభుత్వమువారును, రష్యా ప్రభుత్వమువారును అఫ్ఘనిస్థాన ప్రభుత్వమువారికి హెచ్చరిక చేసినారను వదంతులు అసత్యములని అఫ్ఘనిస్థానపు న్యూస్ ఏజన్సీవారు ఖండించినారు.

# అందరికండ్లును రష్యామీదనే

మదరాసునుండి వెలువడు 'హిందూ' పత్రికకు లండనువిలేఖరి ఈ క్రిందివిషయములను అక్టోబరు ౧౨వ తేదిన తెలిపియున్నాడు:-

ఇప్పుడు జర్మనీ చేయుచున్న గొప్పయుద్ధములో జయాపజయములు రష్యాతోపాటు ప్రపంచమందలి అనేకరాజ్యముల ప్రధాననగరములలో కూడ గొప్పపరిణామమును కలిగించగలవు, మాస్కోలో జర్మనులుదూరినచో మాస్కో పౌరులు ఆయుధధారులై ఇంటింటివద్దను ప్రతిఘటించి పోరాడగలరు.

హిట్లరువాగ్దానములవల్లను, ప్రగల్భములవల్లను బర్లినులో ఉత్సాహము కలిగినది- కాని హిట్లరు ఓడినచో నాజీతత్వము అంతరించవచ్చును. గోరింగు, రిబ్బెన్ ట్రాప్, ఇంకను అనేక సైనిక ప్రధానులు అతనితోఅది ప్రాణముతో తూర్పురంగమున జూదమాడుటకు ఇష్టపడుటలేదు-

అందువల్ల వారలు రష్యాకు ప్రతిఘటనశక్తి చాలునాలని అందోళనచెందుచున్నారు. కొందరు బ్రిటను రష్యాకు ఇంతకంటె ఎక్కువ సహాయము చేయరాదాయని అడుగుచున్నారు. నేడు 'న్యూస్ క్రానికల్' అనుపత్రిక సంపాదకీయ వ్యాసములో ప్రజలు, పార్లమెంటు, పత్రికలును సహాయమే దియుచేయక రష్యా ఓడినచో మాతాను క్షైర్యా బ్రిటిషు దిక్కులంకాగలరని ప్రభుత్వమునకు హెచ్చరికగట్టిగా చేయబడినది సామాన్యుడైనవాడు "మూడునెలలన్నరకాలము బ్రిటను భూమిపైగాని, సముద్రముపైగాని, ఆకాశములోగాని తనమిత్రులంగరిలోనే పెద్దమిత్రునికితోడ్పడుటకు శ్రేష్ఠమైనది తేదనియు, మనముచేసినప్రయత్నమంతయు అకాశమనమాత్రమే-అదిమనవశములో లేనికారణములచే నిరుపయోగమయినది." అనియు చెప్పగలరు-

రష్యాలో జర్మనుల ఉపద్రవకరపురోగమనమువల్ల వాషింగ్టను నగరములో అమెరికనులు ఫాసిజమును మ్యానిజము ఒకదానితో నొకటి పోరాడి చచ్చునని నేత్రలతో ఊరక చూచుచుండజాలమని గ్రహించవలసివచ్చుచున్నది. ఇప్పుడు నాజీల పక్షమున సేబల హెచ్చుగానున్నది. హిట్లరును యూరోపు ఖండమునకంతటికిని అధిపతిగానీయకుండ చేయవలెనన్నచో రష్యాకు వెంటనే సహాయము చేయవలెను-

టోకియోనగరంలోకొన్ని జపానీయ వార్తాపత్రికల సంపాదకీయములలో జర్మనులు శీఘ్రముగా రష్యాయుద్ధమును ముగించి బ్రిటనుపైపురవలసేవనని వ్రాయబడుచున్నది. ఎందుకనగా బ్రిటను అమెరికాలు చిక్కులలోపడినప్పుడే తమకుకావలసినదానిని తాము దోచుకొనగలమని జపానీయులెరుగుదురు. అమెరికా జపానులరాయబార ప్రసంభాషణలు, రూజ్వెల్టుగారు జపానుసేనలు సైబీరియాను గాని లాడివోస్తోకును గాని ఆక్రమించుకొనుటకై రాకవని గ్యారంటీ చేయుటకు కోరుటచేత భగ్నమైనట్లు చెప్పుచున్నారు. జపానువారు అట్టి గ్యారంటీనీయజాలమనిరి- ఇప్పుడువారిని మధ్య వయిరీకించిపోక్కుచున్న ఆర్థికనిషేధములు అంతకంతకు బిగువగుచున్నవి-

ఈలో గాచంగ్ కింగులో మార్షల్ చియాంగ్ కైషేక్ గారు జపానుపైపెద్దదాడిని జరుపుటకు ఇదితగినసమయమని నిర్ణయించుకొన్నారు వారికి ప్రదేశాంగ్షా, ఇచాంగులలో విజయములు కలిగినవి-

# నెల్లూరు అల్లరులు: విచారణ

(స్వవి.)　　మదరాసు, అక్టోబరు ౭

నెల్లూరులో యిటీవల దసరాపండుగలకు పులివేషములు వేయు సందర్భమున అల్లరులు కొట్లాటలుజరిగి పోలీసుకాల్పులుజరిగి పదహారుఏండ్ల బాలిక మరణించినది-ఈఅల్లరుల సందర్భమున నెల్లూరులో హిందువులు పది దినములు హర్తాలును జయప్రదముగ జరిపిరి.

ఈసందర్భమున ప్రభుత్వచర్యలను ఖండించుచు ఈవిషయమై బహిరంగ విచారణ జరుపవలసినది నెల్లూరుజిల్లా హిందూమహాసభ, మద్రాసుహిందూ మహాసభవారు ప్రభుత్వమును కోరగా మద్రాసు ప్రభుత్వమువారు ఈవిషయమై విచారణజరుపుటకు జే. డబ్ల్యు. ప్రీష్టులీ ఐ.సి.ఎస్. రివిన్యూబోర్డు ప్రథమసభ్యునినియమించిరి. విచారణ విధానమును గూర్చి వారు ప్రకటించగలరు. వారు ఈదిగువవిషయములనుగూర్చి విచారించెదరు.

నెల్లూరుజిల్లాహిందువులకు సక్రమమైనసివిలు కోర్టులద్వారా ఒసంగబడిన హక్కులవిషయమునందు స్థానికప్రభుత్వోద్యోగులు ఏవిధంగ ప్రవర్తించవలసియుండును.

౨ హిందూమహాసభవారు, తదితరులుంగావించిన ఫిర్యాదులు నిజమా?

ప్రీష్టులీగారు నెల్లూరులోనే విచారణ సల్పెదరు.

# జర్మను సేనలకు హిట్లరు సందేశము

బెర్లిన్ అక్టోబరు ౩

రష్యా రంగంలో పోరాడుచున్న జర్మను సేనలకు అక్టోబరు ౩వ తేదిన హిట్లరు ఈవిధముగా ఒకసందేశము పంపెను

"మూడునెలల కాలములో మీరు ఒకదాని తర్వాత ఒకటిగా రెక్కలేని శత్రుసైన్యదళాలను ఓడించగలిగినారు, అసంఖ్యాకులను ఖైదీలనుపట్టుకున్నారు. అతివిశాలమైన ప్రదేశములను ఆక్రమించినారు. ఇవి ఉత్తప్రాంతాలు కావు. మనశత్రువులు జీవించేచోట్లుఇవి- అపారమైన యుద్ధపరిశ్రములు ముడిసరుకులు ఉన్న ప్రాంతములు ఇవి ఇకకొద్దివారాలలో శత్రువులకుచెందిన మూడుప్రధాన పారిశ్రామిక ప్రదేశాలు మా చేతిలో పడగలవు. జర్మను సైన్యదళాలకుచెందిన మీపేర్లు మీతోకలిసి ధైర్యముగా పోరాడుచున్న మీ మిత్రరాజ్య సైనికులపేర్లు ప్రపంచచరిత్ర అంతటిలోకి గొప్పదని చెప్పుకొనదగిన విజయముతో శాశ్వతంగా మోకవించబడగలవు, మీరు ౨౫ లక్షల మందికిపైగా ఖైదీలనుపట్టుకొన్నారు- ౧౫౦౦౦ కు పైగా టాంకులను ౧౪౦౦౦ ఫిరంగులను నాశనము.

# ప్రకటన

స. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి కోర్టుఆఫ్ వార్డ్సు నిగరానిలో యున్న వనపర్తి సంస్థాన డివిజన్ కార్యాలయము నుండి యిందుమూలముగా తెలియపరచుట యేమనగా వనపర్తి సంస్థానములో చేరిన రాజనగర్ జాతర ౨౩ అజూర్ ౧౩౫౧ ఫ నుండి ప్రారంభమగును. రాజానగరుకు సమీపములో యుండిన సంస్థానమునకు సంబంధించిన యితర గ్రామములలోను ప్రభుత్వమువారిక్రింది గ్రామములలో కలరా వ్యాపించి యున్నందున రాజానగరు జాతర యీసంవత్సరము స్థానికముగా మాత్రమే జరుపబడును. కనుక యితర యాత్రికులు అచటికిపోవు శ్రమతీసికొనకుందురుగాక.

అజీజ్ అహమద్
వనపర్తి సంస్థాన డివిజన్ ఆఫీసర్

